# శ్రీరామకృష్ణాంజలి




'సాధనరహస్య' 'సర్వసిద్ధాంత సారము' ఆది

బహు గ్రంథకర్తలు

శ్రీ రామకృష్ణాశ్రమములు (బాపట్ల - భీమునిపట్నము)

సంస్థాపకులు

పరమహంస పరివ్రాజకాచార్య

శ్రీ శ్రీ శ్రీ అనుభవానంద స్వాములవారు

★★

ప్రకాశకులు :

**శ్రీ అనుభవానంద గ్రంథమాల**

బాపట్ల-522101 (గుంటూరుజిల్లా)
భీమునిపట్నం-531163 (విశాఖజిల్లా)

రెండవ కుసుమము

సర్వహక్కులు : ప్రకాశకులవి.

పంచమ ముద్రణము : 1986

వెల : రు. 2-00

ప్రతులకు :

1. శ్రీ అనుభవానంద గ్రంథమాల,
బాపట్ల – 522 101

2. పరమహంస కార్యాలయము,
భీమునిపట్నము – 531 163

3. శ్రీ శారదా ప్రింటర్స్
బాపట్ల – 522 101

# ఉపోద్ఘాతము

మానవుని జీవితము విశ్వాసముతోనే ప్రారంభమగును. ఆ విశ్వాసమే లేనిచో జీవితమున సుఖశాంతులు లభ్యముకావు. జీవితపు చరమ దశలో అవిశ్వాసము చేతనే అందరికి దూరమై అశాంతి పాలగుచున్నాడు.

ఈ విశ్వాసము లౌకికమనియు, అలౌకికమనియు రెండు విధములు. లౌకిక విశ్వాసమున స్వార్థము అంతర్గతమైయుండును. ఆ విశ్వాసము చేతనే తల్లిదండ్రులపై గౌరవము, చిన్న వారిపై వాత్సల్యము, పెద్దలయందు వినయము, సేవకులపై కరుణ, సమానులతో స్నేహము, గురువులపై పూజ్యభావము, దైవముపై భక్తియును కలిగి మానవుడు తన జీవితయాత్రను కొనసాగించు చుండును. అహంకార మమకారములు అభివృద్ధి చెంది, స్వార్థము పెరిగిన కొలది వ్యక్తులపై యీ విశ్వాసము తగ్గుటచే నశాంతి అధికమగుచున్నది.

అట్లుగాక, రెండవదైన, అలౌకిక విశ్వాసము, లౌకిక సంబంధములలో తగ్గుచు, దైవముతో ప్రారంభమగుటచే, నింమ అశాంతికితావులేదు. ఇందు శాంతి దినదినాభివృద్ధి పొందుచు, తన నాశ్రయించిన వారినికూడ చేరుచున్నది. భగవంతుడు శాంతి స్వరూపుడుగదా! ఇక అశాంతి ఏది? అట్టి భగవానుని దర్శింప జేయువాడు సద్గురువు. మానవుడు దైవవిశ్వాసము కలిగి, అటుపై ఆత్మ విశ్వాసమును పొంది, అంతట మార్గ విశ్వాసముతో

గురుపుంగవు నాశ్రియించి, ఆ గురు విశ్వాసముతో భగవత్స్వ రూపమును దర్శించి, ఆనందించి, తరించి, శాంతిని పొందును.

భగవద్విశ్వాసము భగవదనుగ్రహ లబ్ధము. అట్టి విశ్వాసముతో శ్రీ అనుభవానంద స్వాములవారు యీ 'శ్రీ రామ కృష్ణాంజలి' ని వ్రాసియున్నారు. ఈ గ్రంథమునందు అవతార విశిష్టత్వము, శ్రీ రామకృష్ణ దేవుని సర్వ సమన్వయత్వము, శ్రీ రామకృష్ణుని ప్రత్యేక సాధనా వ్యక్తిత్వము, శ్రీ వివేకానంద స్వామి గొప్పదనము, శ్రీ అనుభవానంద స్వాములవారి ఆవేదనములు పాఠకుల హృదయములను రంజింప జేయగలవు.

స్వామీజి
శ్రీ[illegible]శానంద

# శ్రీ రా మ కృ ష్ణాం జ లి

శా॥ శ్రీగోవింద! ముకుందవందిత! మహచ్ఛ్రీదివ్య పాదారవిం
దా! గోపీజనచిత్తచోర! సురసంతానప్రియా! బ్రహ్మసం

1. యోగానంద! వివేకమౌనినుత! ఖద్యోతప్రతిద్వంద్వ తే
జోఽగారా! భగవాన్! గురూ! పరమహంసా! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణ ప్రభూ! గోవిందా! ముకుందవందితా! మహత్ శ్రీ దివ్యపాదారవిందా! గోపీజనచిత్తచోరా! సుర సంతానప్రియా! బ్రహ్మసంయోగానందా! వివేకమౌని నుతా! సూర్య సమాన తేజో నిలయమా! భగవాన్! గురూ! పరమహంసా!

శా॥ రామున్ వర్ణన సేయ బంచముఖుడున్, బ్రహ్మాండనిర్మాతయున్
వేమారోడుదురంట! కృష్ణుని నిరూపింపన్ బ్రయత్నించి, తా

2. నామూలాగ్రము వాణి డస్సెనట! దేవా! రామ-కృష్ణుండవౌ
మీ మాహాత్మ్యము నెంచ నేరికగు స్వామీ! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! దేవా! శ్రీ రాముని వర్ణించుటకు పంచముఖుడు, బ్రహ్మాండకర్తయైన బ్రహ్మయును అనేక పర్యాయములు ఓడిపోయాడట! అదేవిధంగా శ్రీ కృష్ణుని నిరూపించుటకు ప్రయత్నించిన సరస్వతీదేవియు పూర్తిగా అలసి పోయినదట! ఇక నీవో రామకృష్ణుడవుగదా! స్వామీ! నీ మాహాత్మ్యమును ఎవరు వర్ణింపగలరు?

మ॥ మతకంబందు జరించు జీవునికి సన్మార్గంబులన్ జూప, సం
ధత నిర్మూలము సేయ, సత్యముగ నిన్ ధ్యానించు పే త్రోవ నా
3. సతిభక్తిన్ మతియింప బూనితిని నిత్యానందః నే నిన్ను, శ్రీ
పతిః నీవేగద నాకు దిక్కికను దేవాః రామకృష్ణప్రభూః

శ్రీ రామకృష్ణ ప్రభూః దేవాః నిత్యానందాః అజ్ఞానమున జరించు జీవులకు సన్మార్గమును జూపుటకును, అజ్ఞానమును తొలగద్రోయుటకును వచ్చిన నిన్ను ధ్యానించుటయే యధార్థ మార్గమని గ్రహించి, నిన్ను భక్తితో స్తుతించుటకు పూను కున్నాను, ఇక నీవేగదా నాకు దిక్కుః

మ॥ కృపతో సాయము సేయువదీనుచు, నీ కీర్తిన్ బ్రశంసింప, లో
పపు భాషన్ గడు పేదభావములతో వ్రాయంగ నే బూనితిన్;
4. సుపదంబుల్, గురుభక్తితత్త్వములు సుశ్లోకప్రభాభావనల్
గృపతో గూర్చవె వాసుదేవః ప్రణతుల్ శ్రీ రామకృష్ణప్రభూః

శ్రీ రామకృష్ణప్రభూః వాసుదేవాః నమస్కారము. భాషా లోపములున్నను, భావనాపటిమ లేకున్నను, నీవు సహాయము చేయుదువనే దృఢ విశ్వాసంతో, నీ మహిమను కీర్తించాలనే భావనతో యీ రచనను ప్రారంభించాను. కాన నాకు పద జాలాన్ని, చక్కని భావములను దయతో అనుగ్రహించు.

మ॥'ష్ణ'యనన్ జిష్ణత కామషట్క రిపులన్ సంహారమున్ జేసియుం
టయు. నానావిధ మోక్షమార్గముల నిష్ఠన్ జొచ్చి, నిత్యంబు ని
5. ర్భయతన్ పే సగుణంబు నిర్గుణములన్ బ్రహ్మత్వమున్బొందశ
క్తియుతుండౌటయు దెల్పుగాదె! నుతకీర్తీ! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణ ప్రభూ! 'ష్ణ' యనగా అరిషడ్వర్గమును జయించి, సంహరించి యుండుట అనియు, నియమ నిష్ఠలతో అనేక మోక్షమార్గముల నిర్భయమున ప్రవేశించి, సగుణనిర్గుణములను, బ్రహ్మత్వమును పొందు శక్తి కలవాడవియు సుస్పష్టము.

మ॥ప్రతిభన్ జూపగ వేదశాస్త్రములకున్ భాష్యంబులన్ వ్రాయుటల్
మతిలో నెంచక, నాచరించి, కడు ధీమంతుండవై, సాధకుల్
6. మతతత్త్వంబుల,యోగమార్గములలో మగ్నత్వమున్బొంద,దా
ల్చితివో వ్యాఖ్యగ నీ స్వరూపము ప్రశస్తిన్ రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! వేద శాస్త్రములకు చక్కని భాష్యముల వ్రాసి, కీర్తిని పొందవలయునని భావింపక, పటుతరబుద్ధి శక్తితో, ఆచరించి, సాధకులు ఆ మత తత్త్వములందును, యోగ మార్గములందును నిమగ్నులగుటకు ఆ భాష్యవ్యాఖ్యాన స్వరూపమునే ధరించితివి గదా!

శా॥ భూతాత్మన్ జగదేకవంద్యు బరమాత్మన్ నిత్యు మాన్యుండవై
జాతంబైన పిలీచికాది చతురాస్యబ్రహ్మ పర్యతమున్
7. బ్రీతిన్ సర్వసమత్వదృష్టి గని, శక్తిన్ నీదు మూర్తిన్ గుణా
తీత బ్రహ్మలయంబు సేయుదువు ఖ్యాతిన్ రామకృష్ణప్రభూ!

శ్రీ రామకృష్ణ ప్రభూ! పిపీలికాది చతుర్ముఖ బ్రహ్మ పర్యంతమగు జీవరాశియందు, సర్వభూతాంతరాత్మయు, జగదేక వంద్యుడను, నిత్యుడును అయిన పరమాత్మను సర్వ సమత్వమున సప్రేమమున గాంచి, శక్తియుక్తుడవై, మహాత్ముడవై, నిర్గుణ పరబ్రహ్మ తత్త్వమున లయము నొందుచుంటివిగదా!

శా॥ శ్రీదేవా, సుర సన్నుతా, సుజన సంసేవ్యప్రభాభాసితా,
వేదవ్యాఖ్య, ముకుందపూజిత హరీ, ప్రేమస్వరూపా, మహే
8. శా, దామోదర, సర్వలోకగురు, విశ్వాధార విశ్వాధ్య! ఈ
శా, దేవా భగవాన్ గురూ పరమహంసా! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! శ్రీదేవా! సురసన్నుతా! సుజన సంసేవితా! తేజోమూర్తీ! వేదవ్యాఖ్యానమా! ముకుందపూజితా! హరీ! ప్రేమస్వరూపా! మహేశా! దామోదరా! సకలలోక గురూ! విశ్వాధారా! విశ్వాధ్యా! ఈశా! దేవా! భగవాన్! గురూ! పరమహంసా

శా॥ శ్రీరామాది దశావతారముల సప్రేమంబుతో దాల్చి సం
సారంబందు నిమగ్నులైన నరులన్ సంరక్ష గావింప స
9 ద్వైరాగ్యంబును, జ్ఞానమున్ దెలుపు దివ్యజ్ఞానమూర్తీ! నమ
స్కారంబుల్ గొనుమయ్య పద్యగతి నీకా! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! తండ్రీ! శ్రీరాముడు మొదలుగాగల దశావతారముల ప్రేమగా ధరించి, సంసారమగ్నులైన మానవుల రక్షించుటకు జ్ఞానవైరాగ్యముల ప్రబోధించు దివ్యమూర్తీ! పద్య క్రమములో నా నమస్సుల స్వీకరింపుము.

మ॥ నవమాసంబుల మోసి నిన్ను గని ప్రాణంబట్లు పోషించి, గౌ
రవమర్యాదల ప్రేమముంచు గుణచంద్రాదేవియున్, రామభ
10 క్తివిశేషుండు పవిత్రుడార్యుడు ప్రశస్తిన్ శ్రీక్షుదీరాముడే
మి వరాలన్ గనినారో నిన్ను గన స్వామీ! రామకృష్ణప్రభూ!

శ్రీ రామకృష్ణప్రభూ! నవమాసములు నిన్ను ధరించి, కని, నిన్ను ప్రాణమురీతి పోషించిన సుగుణవతియైన తల్లి చంద్రామణీదేవియు, విశేషరామభక్తితత్పరుడును, పవిత్రుడును, పూజ్యుడును అయిన తండ్రి క్షుదీరాముడు నిన్ను పుత్రునిగా పొందుటకు ఏమి వరములను పొందియుండిరోగదా!

మ॥ జడమౌ రాతిని గొల్చి, దాన పరసాక్షాత్కారి దర్శించి యం
తట సంభాషణసేసి యాడితివి మోదంబొప్ప నా దేవితో,
నడువన్ గల్గితివామె యానలకు లోనై నీవు, మోక్షంబనన్
11. విడిగా పేరొకటుండునే! గురుతపస్వీ! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! గురుతపస్వీ! నీవు జడమగు రాతిని పూజించి, అందు పరదేవతయైన కాళికాదేవిని సందర్శించి, ఆమెతో సంభాషణ సలిపి, ఆ దేవితో నానందముగా ఆడుకొని, ఆమె ఆజ్ఞలను పాటించితివిగదా! ఈ యానందముకంటె ముక్తి వేరుగ నున్నదా?

మ॥ అవినీతుల్ గుణదూరులై బుధుల నన్యాయంబుగా బాధసే
 య విలోకించుచు శిష్టరక్షణము సేయన్, దుర్మింపగా దుష్టులన్
12, అవతారంబుల దాల్చుచుందువు సదా యత్యంత వాత్సల్యమై
 స్తవనీయుండవు భక్తరక్షకుడవీశా! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! ఈశా! నీతిదూరులై, గుణరహితులైనవారు మంచివారిని అన్యాయముగా బాధించుచుండుట గాంచి అత్యంత వాత్సల్యమున శిష్టరక్షణ దుష్టశిక్షణల గావించుటకై అవతారముల ధరించు భక్తరక్షకుడవు, స్తుతిపాత్రుడవును నీవే సుమా!

మ॥ పరిణామక్రమమొప్ప పాదములు నా భాగంబులే లేని భీ
 కర మత్స్యాకృతి దాల్చి, నాల్గు పాదములు గంఠంబుతో గూర్మమౌ
13, చు, రజోబుద్ధి వరాహరూపమగుచున్, శూరత్వమున్ గల్గి శ్రీ
 నరసింహాకృతి దాల్చితే ప్రతిభనన్నా! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! ఆ నీ అవతారములుకూడ క్రమవిధానమునే సూచించుచున్నవి. ప్రథమమున కరచరణాద్యవయవ విభాగములేని మత్స్యరూపమును ధరించితివి. అంత నాలుగు

పాదములు, కంఠము కలిగిన కూర్మరూపమును పొందితివి. ఆపై రజోగుణాధిక్యమున వరాహ రూపముదాల్చితివి. పిదప శూరత్వమును గలిగి, సింహ మానవరూప ఏకత్వముచే నరసింహాకృతిని ధరించితివి.

మ॥ చదువన్ నేర్చితివంత వామనుడవై శాస్త్రంబులన్ పేదకో
విదులెల్లన్నుతియింప, త్రుంచితివి పృథ్వీనాథుల న్మూర్ఖులన్
14. విదితాధ్యాత్మిక కోపపూరిత మహావేశంబునన్ భార్గవా!
ఉదయంబాది దోసంగులెంచుట గుణంబో! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! శాస్త్రార్థముల బఠించి, పేద పండితులచే నుతింపబడి వామనమూర్తివి అయితివి. అంత మూర్ఖులైన రాజన్యులను సంహరించుటకు మహాక్రోధావేశములపొంది, పరశురాముని అవతారమును ధరించితివి. కాని భార్గవా! దోషముల గాంచుట సద్గుణము గాదుసుమా!

శా॥ కైవల్యస్థితి బొంద నిచ్ఛ గలుగన్, గార్హస్థ్య ధర్మంబులన్
ప్రావీణ్యంబుగ నిష్ఠతో జరిపి, సర్వాదర్శకత్వంబునన్
15. నీవా కర్మపథంబు త్రొక్కితివి సందేహింపకో రాఘవా!
ఆ విద్యల్ తుదకున్ ఫలించెగద దేవా! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! దేవా! నీవు రాముడవై, కైవల్యస్థితిని పొందు కోరిక బుట్టిననూ, గృహస్థ ధర్మముల నతి ప్రావీణ్యముగ నిష్ఠతో నాచరించి, సర్వాదర్శముతో నీవు ఆ కర్మమార్గము ననుసరించితివిగదా రాఘవా! ఆ విద్యలు కూడ ఫలించెనుగదా!

శా॥ ప్రేమంబున్ గొని యంత కాంక్షలను తత్ప్రేమంబుతో ద్రుంచిని,
నిష్కామత్వంబున గర్మలన్ జరిపి, రాసక్రీడ నృత్యాదిచే
16. సామాన్యుల్ గ్రహియింప జూపితివిగా సద్భక్తిమార్గాల ని
ష్కామత్వంబు పునాది భక్తికని కృష్ణా! రామకృష్ణప్రభూ!

శ్రీ రామకృష్ణప్రభూ! నీవు శ్రీకృష్ణుడవై, ప్రేమ యొక్క అర్థమును వివరించి, ఆ ప్రేమతో కోరికలను నశింపజేసి, కర్మలను నిష్కామముగ జేసి, రాసక్రీడాదికములందు భక్తియొక్క పరాకాష్ఠను సామాన్యులకు దెలియపరచితివి. కృష్ణా! నిష్కామ కర్మ భక్తికి పునాదియను రహస్యము ను నిరూపించితివిగదా!

శా॥ జ్ఞానంబేర్పడ నంత త్యాగివయి, సన్న్యాసంబు గైకొంచు, అ
జ్ఞానంబెల్లర సమ్ముఖంబునకు బ్రజ్ఞామూర్తివై జేర్చి య
17. జ్ఞానాంధంబును జీల్చిపైచితివి సిద్ధాసిద్ధి బుద్ధుండవై
జ్ఞానంబన్నను భక్తిసంభవముగాగన్ రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణ ప్రభూ! నీవు బుద్ధుడవై వివేకముతో త్యాగివై, సన్న్యసమును స్వీకరించి, ప్రజ్ఞామూర్తివై, అజ్ఞానాంధకారమును చీల్చి, ఆ జ్ఞానము నెల్లరికి బంచితివిగదా! జ్ఞానము భక్తి జనితమని ప్రకటించితివి.

శా॥ సిద్ధాంతంబలె బోధసేయవలె నా చింతామతిన్ వీడి. యే
రాద్ధాంతంబులులేక త్యాగివి పరబ్రహ్మంబవాద్యుండవై
18. సిద్ధాత్ముండవు శ్రీజగద్గురుడవై శ్రీరామకృష్ణుండవై
ఇద్ధాత్రిన్నవతారవంద్యుడవు స్వామీ! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! స్వామీ! బుద్ధునివలె బోధచేయ వలయునను భారమును దూరీకృతము గావించి, ఏ రాద్ధాంతములు చేయక, త్యాగివై, పరబ్రహ్మవై, అద్యుడవై, సిద్ధి స్వరూపుడవై, జగద్గురువై, అవతారవంద్యుడవై, యీ లోకమున శ్రీరామ కృష్ణునిగ అవతరించితివి.

మ॥ జలరాశిన్ గల వారిబిందువుల, నీ క్ష్మామండలిన్ గల్గు జీ
వుల, నక్షత్రసముహమున్ జగతి సంభూతంబులౌ యాకులన్
19. సులభంబేయగు నెంచ గాని గుణసంశోభన్ విరాజిల్లు నిన్
వలనౌనే గణియింప బ్రహ్మకును దేవా! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! దేవా! సముద్రమున గల జల బిందువులనైనను లెక్కింపవచ్చును. లేక భూమిపై సంచరించు జీవరాశినైనను గణింపవచ్చును. లేక ప్రపంచమునగల వృక్షముల ఆకులనైనను ఎంచుట సులభమే యగుచున్నది. కాని సుగుణములచే వెలుగొందు నిన్ను గ్రహించుటకు బ్రహ్మకును అసాధ్యమే యగుచున్నది.

శా॥ బాలుండౌ యదునందనుండు తన దేవత్వంబు రూపింపగా
లీలన్ మార్చె శరీరమున్నటులె యుత్కృష్టంబుగా నీవు నీ
20. లీలామానుషతత్త్వమున్ దెలుప శారీరాకృతిన్ భారమున్
బాలత్వంబున మార్చి చూపితివి దేవా! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణ ప్రభూ! తన దేవత్వమును నిరూపించుటకై బాలకృష్ణుడు తన శరీరమును ఒకసారి తేలికగను, మరియొక పరి

బరువుగను చేసినట్లు నీవును బాల్యముననే నీ లీలలయొక్క ఉత్కృష్టతను చాటుటకై, శరీరమును మార్చి చూపించితివిగదా దేవా!

మ॥ మధుపంబెట్టుల సర్వపుష్పమధువున్ మాధుర్యమున్ గ్రోలియు
త ధరిత్రిన్ ముదమొందునో యటుల తత్త్వార్థప్రదానంబునౌ
21. సుధ భక్షింప మతంబులన్ దిరిగి శ్రీశున్ బొంది నిత్యుండవై
బుధలోకస్తుతి నొందినావుగద శంభూ! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణ ప్రభూ! శంభూ! తేనెటీగ లోకము నందలి సమస్త పుష్పములగల మకరంద మాధుర్యమును గ్రోలి ఆనందించు రీతిగ నీవును సకల మతముల నన్వేషించి, అందలి తత్త్వార్థ సంయుతమైన అమృతమును ఆస్వాదించి, భగవానుని సందర్శించి, నిత్యుడవై, పండితవర్యుల మన్ననల నందుకొనియుంటివి.

మ॥ చదువన్ వ్రాయగలేని నీ వుపనిషచ్ఛాస్త్రార్థ సారంబులన్
విదితంబౌనటు దెల్పుటల్, గురువరుల్, విద్యాధికుల్ నిన్నుస
22. మ్ముదమై కొల్చుట, పేదపైన నిను సమార్త్రిట్టుల్ జమీందార్లునీ
పదముల్ బట్టుట చాల చిత్రములు దేవా! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణ ప్రభూ! చదువుటగాని, వ్రాయుటగాని రాని నీవు, ఉపనిషత్తులను, శాస్త్రార్థసారములను సర్వులకు సుగమముగ బోధించుటయు మరియు విద్యాధికులు, గురువర్యులు నిన్ను కొలుచుటయు, పేదపైన నిన్ను జమీందార్లు సామార్త్రిట్టులు నీపదసన్నిధిని కొలువుండుట ఆశ్చర్యకరముగదా దేవా!

శా॥ ద్వైతాద్వైత విశిష్ట పద్ధతుల శైవాద్వైత శాక్తంబులన్
శ్రౌత స్మార్తము బౌద్ధ క్రైస్తవము నిస్లామాది మార్గాల భా
23. వాతీతంబుగ బొంది యా యనుభవంబానాంతమున్ గాంచు నిన్
జేతన్ గాదు వచింపగా గురుతపస్వీ! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! గురుతపస్వీ! ద్వైత, అద్వైత, విశిష్టాద్వైత, శైవ, శాక్త, శ్రౌత, స్మార్త, బౌద్ధ, క్రైస్తవ మహమ్మదీయాది మత సాధనల నాసాంతము ఆచరించి, భావాతీతానుభవమును పొందిన నిన్ను నేను వర్ణింపలేనుసుమా!

మ॥ కనకంబొండు కరంబునందునిచి వేడ్కన్ మంటి పేరొక్కటన్
గొని శ్రేష్ఠంపు విచారణాపరతి సాంగోపాంగసుజ్ఞాన వా
24. హినులన్ మున్గి సమత్వదృష్టి గని రెండింటన్ సమానత్వమున్
గను వైరాగ్యము నెంత నెంతును శుభాంగా! రామకృష్ణప్రభూ

శ్రీరామకృష్ణ ప్రభూ! శుభాంగా! ఒక చేతిలో బంగారమును, మరియొక చేతిలో మట్టిని గ్రహించి, చక్కగ విచారణసలిపి సమత్వమున గాంచి, యథార్థ సుజ్ఞాన ప్రవాహమున లయించిన నీ సమత్వవైరాగ్యముల వర్ణించుట సాధ్యమా!

మ॥ తన పాదంబులదాకి రాతినట కాంతన్ జేసె రాముండు, కు
ష్ఠిని గౌరాంగుడు కౌగిలించి బలియన్ జేసె, రోగంబులన్
25. దన హస్తంబుల దాకి క్రీస్తు తరిమెన్, దర్శింప నవ్వెంతవో,
మునుచున్ మీ కరముల్ సమాధులలో మమ్మున్ రామ—

శ్రీరామకృష్ణప్రభూ! శ్రీరాముడు తన పదముల నంటిన రాతిని కాంతనుగచేసెను. శ్రీ గౌరాంగ మహాప్రభువు కుష్ఠురోగిని కౌగలించుకొని ఆ వ్యాధిని న శిం ప జే సె ను. ఏసుక్రీస్తు తన హస్తముచే స్పర్శించి రోగములను దూరీకృతముగావించెను. కాని ఆలోచించిన వానిలో గొప్పదన మేమున్నది? నీ కరస్పర్శయో మాకు సమాధి మగ్నతలను కలిగించునుగదా!

మ॥ చిరుప్రాయంబున నీవు తత్త్వగుణ సుశ్రీ జెంది, సంసారమా
కరుణాన్వీత చరిత్రి కాళికిడి, భక్త్యంభోధిలో మున్గి, భీ
26. కర తత్త్వార్థతరంగఘాతముల మోక్షప్రాప్తికై పొందె, స
త్వరమా బ్రహ్మము నొందవే గురు మహాత్మా! రామకృష్ణా

శ్రీరామకృష్ణప్రభూ: గురూ! మహాత్మా! బాల్యముననే నీవు సుగుణముల గడించి, భక్తి సంద్రమున మునిగి, సంసారమును కరుణామూర్తియగు కాళికాదేవికి యిడి, భయంకరమైన తత్త్వార్థ ములను తరంగముల మోక్షప్రాప్తికి ఉపయోగించి, శీఘ్రముగ నా బ్రహ్మస్వరూపమును పొంది యుంటివిగదా!

మ॥ గురుడా! ఏడవయేట క్షేత్రముల బయల్ కృష్ణ మేఘంబుపై
దిరుగాడన్ గని కృష్ణదర్శనమునన్ దివ్యంబు పూర్ణంబు భా
27. స్వరమౌ భావసమాధి భాగ్యము ప్రపంచాతీతమై పొందివే
పరమాత్మా! క్షుదిరాముపుత్రి! గురుదేవా! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణ ప్రభూ! గురుదేవా! పరమాత్మా! క్షుదిరాము పుత్రా! నీవు ఏడవయేటనే పొలములదిరుగుచు, నల్లని మేఘముపై

తెల్లని పక్షులు ఎగురుటనుగాంచి, అట కృష్ణుని దర్శించి, ప్రకాశమై, దివ్యమై, పూర్ణమై. ప్రపంచాతీతమైన భావసమాధి భాగ్యమును పొంది యుంటివిగదా!

మ॥ శివవేషంబునుదాల్చి, జ్ఞానమయమౌ చిద్రూపమున్ జూచి మా
నవ లోకంబున సర్వమున్ మరచి, జ్ఞానానందుడౌ శంకరున్
28. అవలోకించుచు నైక్యమున్ గనెడు బ్రహ్మానందసంశోభితా
భవదీయాంఘ్రులకేను మ్రొక్కెదను దేవా! రామకృష్ణ-

శ్రీరామకృష్ణ ప్రభూ! బ్రహ్మానంద సంశోభితా! దేవా! బాల్యమున శివ వేషమునుధరించి, జ్ఞానమయమగు చిద్రూపమును గాంచి, సర్వమును మరచి, జ్ఞానానందస్వరూపుడైన శంకరుని హృదయమున వీక్షించి, అందు ఐక్యమునొందిన నీపాద పద్మములకు నేను నమస్కరించుచుంటిని.

మ॥ భగవత్పాదుడు పెండ్లికే వెరచె, స్త్రీపాశాల బుద్ధుండు పే
తెగ గోసెన్ చిననాడె, వృద్ధుడయి సాధ్వీన్ వీడె రామానుజుం
29. డు; గుణంబొప్ప సతీమణిం గొనుచు దృష్టుల్ గాంతపైదీసి పూ
ర్తిగ బ్రహ్మైక్యము జేసిపైచితివి శక్తిన్ రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! శ్రీ శంకర భగవత్పాదులు వివాహమున భయమును చెందెను. శ్రీ బుద్ధ భగవానుడు చిన్ననాటనే స్త్రీపాశములను త్రెంచివైచెను. శ్రీ రామానుజాచార్యులు వృద్ధుడైన పిమ్మట భార్యను త్యజించెను. కాని నీవో భార్యను

స్వీకరించి, దుష్టుల భార్యపై నుంచక, శక్త్యనుగ్రహమున దృష్టిని అంతర్గత మొనరించి బ్రహ్మైక్యము చేసితివిగదా!

మ॥ వనమందొక్కదినంబు నీవు విహరింపన్ జూచి శ్రీయేసు, లే
దని భేదంబు నిజమ్ముగా తనకు నీకంచున్ బరిష్వంగమున్
30. గని నీలో లయమొందె సర్వగురులోకంబెల్ల నీమూర్తిగా
దనరన్ స్పష్టముగా గురూత్తమ! మహాత్మా!రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! మహాత్మా! గురూత్తమా! నీవు ఒక దినము వనములో విహరించుచుండ ఏసుక్రీస్తు నీకు దర్శనము నిడి, 'యథార్థమున మనమిరువురము ఒక్కటే భేదములేదు' అని పలికి, కౌగిలించి, సర్వగురువులు నీ మూర్తియేయనుచు నీలో లీనమయ్యెనుగదా!

శా॥ సాకారంబని విగ్రహంబులకు సాష్టాంగంబు గావించినన్
లోకేశుండెరుగండొ! యంచు గడు సుశ్లోకుండపై గొల్చె నీ
31. వా కారుణ్యపయోధి గాంచితివి సర్వాకారమూలంబుగా
మీ కార్యంబులమానుషంబులగు స్వామీ! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! విగ్రహములు దేవుని సాకారములుగ భావించి, సాష్టాంగము గావించిన నా లోకేశ్వరుడు గ్రహించునుగదా యనుచు బూజల సలిపిన నీవు సర్వాకారములకు మూలమై కరుణాసముద్రుడైన ఆ దేవుని దర్శించితివి. స్వామీ! మీ కార్యములన్నియు మానవాతీతములుగదా!

శా॥ 'రామా' యన్న నిమేషమే చిరతమై 'రాంలాల' నామంబునన్
నీముందాటలనాడు, కృష్ణడగుచున్ నీ మ్రోల సాక్షాత్కరిం
32. చేమేమో సరసోక్తులాడుగద 'హే కృష్ణా' యనన్, దేవ దే
వా! మీ శక్తి యమానుషంబుగద వహ్వా రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! దేవదేవా! 'రామా!' యని పిలిచిన వెంటనే రాముడు బాలుడై 'రాంలాల' నామమున నీముందు ఆటల నాడును. 'హే కృష్ణా! యని పిలిచినంతనే బాలకృష్ణుడు సాక్షాత్కరించి ఏమేమో సరసోక్తు లాడుసుగదా! అహా! నీ శక్తి అమానుషముసుమా!

మ॥ భగవంతున్ గనుచున్న వాడ నిట విస్పష్టంబుగా, నీవు కో
రగ జూపంగలవాడ' నంచనగ లేరై రెవ్వరున్ దొల్లి, యీ
33. పగిదిన్ నీ యనుభూతి సంపదను విశ్వవ్యాప్తి గావింప పె
క్కగు శక్తుల్ ప్రకటించినాడవు శుభాంగా! రామకృష్ణ ప్రభూ!

శ్రీరామకృష్ణ ప్రభూ! శుభాంగా! 'ఇచ్చటనే నేను భగవంతుని సుస్పష్టముగ చూచుచున్నాను. మరియు నీవు కోరినచో ఆ భగవానుని చూపింపగలను' అని పూర్వ మెవరును పలుకలేదు. ఈ విధముగ నీ అనుభవ సంపదను విశ్వవ్యాప్తమొనరింప ననేక శక్తులను ప్రదర్శించియుంటివిగదా!

శా॥ 'ఏ దేవుండట రాముడై తనరి శ్రీకృష్ణుండుగా నయ్యెనో!
ఆ దేవుండె ను! రామకృష్ణుడను నీ యాకారమున్ దాల్చె' నా
34. యాదార్యంబున భక్తసంతతికి నీ యాథార్థ్యతన్ జాటితే
ఓ దేవా! నిను నెంతగా బొగడుటో! ఓ రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! ఏ దేవుడు శ్రీరాముడైయుండి, పిదప శ్రీకృష్ణుడుగా నయ్యెనో ఆ దేవుడే యీ రామకృష్ణుడను రూపమును ధరించెను' అని నీ యధార్థస్థితిని భ క్త సంత తి కి ఉదారముగ వ్య క్తము చేసితివిగదా! దేవా! నిన్ను ఎంతని పొగడను?

శా॥ మూడే రోజులలోన బుద్ధు, నటులే మూన్నాళ్ళలో గ్రీస్తు, నా
మూడే రాత్రులలో మహమ్మదు, పరంబౌ నిర్వికల్పంబు నా
35. మూడే వాడుల నెవ్వడైన గనెనే పూర్వంబు! దర్శించునో
నేడైనన్! గనగల్గునొక్కొ యికనేనిన్ రామకృష్ణ ప్రభూ!

శ్రీరామకృష్ణ ప్రభూ! మూడురోజులలో బుద్ధుని, మూడు దినములలో క్రీస్తును, మూడు రాత్రులలో మహమ్మదును, ఆమూడు రోజులలోనే పరమగు నిర్వికల్ప సమాధినికూడ పూర్వము ఎవరైనను పొందియుండిరా? నేడైన దర్శించుదురా? ఇక ముందైనను పొందగలరా?

మ॥ అవలంబించియొకొక్క మార్గమును గమ్యస్థానమున్ జేర యో
గివ రేణ్యుల్ గురులైన, కాని పటుశక్తి న్నీవలెన్ సర్వ మా
36. ర్గవితానాంతములంది సర్వమత సౌభ్రాత్రార్థ సందేశసా
ర విశేషంబుల దెల్పగల్గిరె! సుధీరా! రామకృష్ణప్రభూ,

శ్రీరామకృష్ణ ప్రభూ! సుధీరా! యోగివర్యులుగాని, గురు వరేణ్యులుగాని ఒక్కొక్క మార్గము నవలంబించి, గమ్యస్థాన మును పొందిరి. కాని నీ వలె శక్తివంతులై, సర్వమార్గ గమ్య ముల జేరి, సకలమత సౌభ్రాతృత్వసందేశసార విశేషముల తెలుపగలిగియుండిరా?

మ॥ తొలిజన్మంబులసల్పి, యోగపథమందున్ జొచ్చి యంతన్ సుభ
క్తిలతన్ బొందియటన్, విరాగయుత శక్తిన్ జ్ఞాన తత్త్వాబ్ధిలో
37. జలకంబాడుచు నిర్వికల్పసుధ నాస్వాదించి బ్రహ్మైక్య స
త్ఫలమున్ బొందు క్రమంబుజూపితివి దేవా! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! దేవా! పూర్వ మనేక జన్మముల బొంది, యోగమార్గమున బ్రవేశించి, అంత భక్తిలతను పొంది, వైరాగ్యముతో కూడిన శక్తిచే జ్ఞానతత్త్వ సాగరమున మునుగుచు, నిర్వికల్పసుధ నాస్వాదించి, బ్రహ్మైక్యమను సత్ఫలమును సాధించు క్రమ విధానమును చూపించితివిగదా!

మ॥ పద ముల్ శారదయున్ నరేంద్రుడు సదా భక్త్యుక్తి సేవింప,శా
రద గంగాధర శశి రాఖల హరుల్ శ్రద్ధాళులై గొల్వ, స
38, మ్ముదమై తారక కాళి యోగ హరులున్ బూజింప, నానందసం
పద శోభిల్లెడు నీకు దండములు దేవా! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! దేవా! నీ పదములను శారద నరేంద్రులు భక్తితో సేవింప; గంగాధర, శశి, రాఖాల్,హరి, శరత్తులు నిన్ను శ్రద్ధతో గొలువ! హరి, యోగి, కాళి, తారకులు నిన్ను ఆనందముతో బూజింప నానంద సంపదలతో శోభించు నీకు నమస్కారము.

మ॥ చదువన్ మానితివేల? వామనుడవై శాస్త్రంబులన్ నేర్చి నీ
పదపద్మంబుల రాణిసేశ్వరునిచే బట్టించుటల్ వ్యర్థమో!

39\. పదవిభాగము తర్కశాస్త్రములకున్ బర్వెత్తుటల్ రిక్తయో,
మదిలో నేమని యెంచితోగద మహాత్మా! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణ ప్రభూ! వామనావతారమున శాస్త్రముల బఠించి, నీ పాదపద్మముల రాక్షసేశ్వరునిచే బట్టించుకొనుట వ్యర్థమని భావించితివా? లేక తర్కశాస్త్ర పదవిభాగములు చేయుట అనవసరమని యెంచితివా? ఏమని భావించితివోమరి! మహాత్మా! అసలు చదువుట మానితివేమి?

శా॥ ఔరా! భార్గవమూర్తివై మును దుర్వ్యాపారులౌ రాజులన్
నీ రోషాతికరాళఖడ్గమున నీ నేర్పొప్ప ఖండింపవే,
40\. ఆ రోషంబెటువోయె! సత్వగుణమే యత్యుత్తమంబెంచితో,
వైరాగ్యప్రతిభాస్వరూప! గురుదేవా! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణ ప్రభూ! వైరాగ్యప్రతిభాస్వరూపా! గురుదేవా! పూర్వము భార్గవరాముడవై, దుష్టులగు క్షత్రియులను రోషముచే భీకర ఖడ్గముతో ఖండించితివిగదా! ఔరా! నేడు ఆరోషమేమయ్యెను? సత్త్వగుణమే ముఖ్యమని భావించితివా?

మ॥ మును శ్రీరాముడవై యనేక విభవమ్ముల్ గల్గి గార్హస్థ్య ధ
ర్మ నికాయంబుల నల్పి, నేడఖిల కర్మత్యాగివై యుండుటే
41\. మి? నిరాఘాట సమాధి సంస్థితుల జెల్మిన్ బొంద గర్మంబుల
డని నిర్ధారణ జేసితేమొగద! యీశా! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! ఈశా! మును శ్రీరామచంద్రుడవై, అనేక వైభవములతో గృహస్థ ధర్మముల బాటించిన నీవు, నేడు

సర్వ కర్మత్యాగివై యుండుటకు కారణమేమి? నిరాటంకముగ సమాధి సంస్థితుల పొందుటకు కర్మములు అటంకములైనవేమో!

మ॥ జవరాంౘ్రదన్ దరిజేర్చి నిత్యమును రాసక్రీడలన్ మున్గి ప్రా
 భవమై కాంచనచేలధారుడగు గోపాలుండవై యుండి, యే
42. మి? విచిత్రంబుగ గామినీకనకమున్ మిథ్యావిధిన్ జూచి నీ
 వు విసర్జించుటకేమి కారణము? శంభూ! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! శంభూ! నాడు శ్రీకృష్ణుడవై, యావన వతుల దరిజేర్చి, నిత్యము రాసక్రీడాదికము న మునిగి, వైభవో పేతుడవై, కాంచనచేలధారివైన నీవు, నేడు ఆ కామినీ కాంచన ముల మిథ్యగ భావించి, వానిని త్యజించుటకు కారణము ఏమి!

మ॥ పలు కష్టంబులకోర్చి బ్రహ్మమును సంపాదింప, యత్యంత ని
 ర్మల సుజ్ఞాన సుగంధమెల్లెడల గ్రమ్మన్ రాజసోద్రేక చ
43. ర్యల దేశమ్ముల ముంపజాలు నట సిద్ధార్థుండవై యుండి యీ
 కలిలో సర్వము ద్రోసిపైచితివి రంగా! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! రంగా! పూర్వము సిద్ధార్థుడవై, బహుళ కష్టముల నోర్చుకొని, బ్రహ్మజ్ఞానివై, ఆ నిర్మల సుజ్ఞాన సువా సనల వ్యాపింపజేయుటకై రజోగుణమున దేశమంతట బర్యటించిన నీవు యీ కలిలో సర్వమును విడిచి పెట్టితివిగదా!

మ॥ అదుగో! పక్షులు పాటబాడు, స్వరమా యంభోధియే వేసె నీ
 రదముల్ మ్రోగె మృదంగరూపమున, దాళంబౌ యదే కోకిలం

44\. బిదియా పాటకచేరి, యా ప్రకృతి నీకేర్పాటుగావించి తా
మదమున్ బొందునుగాదే దేవ! యనిశమ్మున్ రామకృష్ణప్రభూ

శ్రీరామకృష్ణప్రభూ! అదుగో! పక్షులు పాడుచున్నవి. సముద్రము స్వరము వేయుచున్నది. మేఘములు మృదంగము వలె మ్రోగుచు తాళము వేయుచున్నవి. కోకిల పాడుచున్నది. దేవా! ప్రకృతి యిట్టి సంగీతమును నీకు ఏర్పరచి ఆనందించుచున్నది గదా!

శా॥ సత్యాన్వేషణ తీవ్రత త్త్వయుతుడై సర్వంబు వర్జించుచున్
నిత్యానందమయస్వరూపుడగుచున్ నిండారు ప్రేమంబుతో
45\. నత్యంతప్రభ నిర్మలాత్ముడయి జ్ఞానజ్యోతియై సిద్ధుడౌ
శ్రీత్యాగిన్ గొలుతున్ వివేకుని ప్రశస్తిన్ రామకృష్ణప్రభూ,

శ్రీరామకృష్ణప్రభూ! తీవ్ర సత్యాన్వేషణమును గావించి, సర్వమును త్యజించి, నిత్యానంద స్వరూపుడై, ప్రేమమూర్తియై, అత్యంత నిర్మలుడై, జ్ఞానజ్యోతియై, సిద్ధుడై, త్యాగియైన వివేకానందుని పూజించుచున్నాను.

మ॥ తన గంభీర వచోప్రవాహముల తత్త్వార్థంబు పొంగార, భీ
తిని యాకాశము తల్లడిల్లుకరణిన్ దేదీప్యమానంబుగా
46\. ఘనుడై పృథ్వి జలింపజేసిన వివేకానంద యోగిన్ సమ
స్త నరేంద్రప్రియు గొల్చి మ్రొక్కెద సురేశా! రామకృష్ణ

శ్రీరామకృష్ణ ప్రభూ! సురేశా! తన గంభీర-వాక్ప్రవాహమున తత్త్వార్థముపొంగ, భయమున ఆకాశము తల్లడిల్లగ,

ప్రకాశస్వరూపుడై, ఘనుడై, భూమిని చలింపజేసిన సమస్త నరేంద్రప్రియుడైన శ్రీ వివేకానంద యోగికి నమస్కరించు చున్నాను.

శా॥ ఖద్యోతద్యుతి మించు దీప్తులను ప్రఖ్యాతిన్ దిగంతంబులన్
సదోద్యగంబున మించి తేల్చు ప్రతిభాసామ్రాట్టునన్, బ్రహ్మాస
47. ద్విద్యారణ్యవిహార కేసరివలెన్ వేదాంతగర్జార్భటిన్
ఆద్యుండైన వివేకు గొల్చెద మహాత్మా! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! సూర్యకాంతికి మించు తేజముతో, దిగంతముల నిండిన ప్రఖ్యాతితో, సదోద్యగమున మగ్నత నొందించు ప్రతిభాసామ్రాట్టువలె, బ్రహ్మ సద్విద్యారణ్య విహార వేదాంత కేసరివలె గర్జించుచు, ప్రథమస్థానమును పొందిన శ్రీ వివేకానందుని పూజించుచున్నాను.

శా॥ ఆనందామృతధారలో యనగ నిర్వ్యాజప్రపూజ్యంబులై
మౌనీంద్రప్రతిపన్న తత్త్వరస సంపన్న ప్రవాహంబులో
48. జ్ఞానోద్రేకజ నిర్మలస్ఫురిత సూనస్తుత్య వర్షంబనన్
దేనెల్ జిల్కు వివేకు వాక్యములు శక్తిన్ రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! ఆనందామృతధారలై, అవ్యాజ ప్రపూజితములై, మౌనివర్యులచే ప్రతిపాదితమైన తత్త్వరస సంపన్న ప్రవాహములై, జ్ఞానోద్రేకజన్యములై, నిర్మలములై ప్రకాశించిన సుమవర్షమువలె శ్రీవివేకానందుని వాక్యములు శక్తి వంతములై, తేనెలూరించుచున్నవి గదా!

మ॥ అనఘా! మారుతి యబ్ధి దాటి పటు శౌర్యస్థైర్య గాంభీర్య శ
క్తి నిధిన్ రాముని రాజ్యమున్ నిలుపుమాడ్కిన్ రామకృష్ణార్య పా
49. లన స్థాపించి యఖండ దిగ్విజయమై రంజిల్లి ప్రఖ్యాతుడై
న నరేంద్రున్ ఘను సన్నుతింతుగద యన్నా! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! అనఘా! శౌర్య స్థైర్య గాంభీర్య, శక్తులుగల శ్రీరామచంద్రుని రాజ్యమును నిలుపుటకు మారుతి సంద్రమును లంఘించినట్లు అఖండ దిగ్విజయముతో శ్రీరామకృష్ణ గురుదేవుని పాలనమును ఆనందముగ సంస్థాపించిన ప్రఖ్యాతుడును, ఘనుడును అయిన నరేంద్రుని స్తుతించుచున్నాను.

మ॥ జనకున్ బోలినయోగి, శంకరువలెన్ శాస్త్రజ్ఞుడున్, బుద్ధ రీ
తిని బ్రేమాబ్ధియు, గౌరుమాడ్కి ఘనభక్త్యుక్తుండు, జ్ఞానంబునన్
50. గనగా శ్రీశుకదేవుడయ్యెడు వివేకానందు వర్ణింప నా
కనువౌనే! అమరేంద్రసన్నుత! పరాత్మా! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! అమరేంద్రసన్నుతా! పరాత్మా! జనకునివలె యోగియు, శ్రీ శంకరునివలె శాస్త్రజ్ఞుడును, బుద్ధుని పగిది ప్రేమస్వరూపుడును, గౌరాంగునివలె మిక్కిలి భక్తియుక్తుడును, శుకమహర్షి చందము విజ్ఞానియునైన వివేకానందుని వర్ణించుట సాధ్యమా?

శా॥ నీ చారిత్రము నీ మహామహిమయున్ నీ మార్గముల్ వాక్యముల్
నీ చైతన్యము నీదు భక్తిరతియున్ నీ మూర్తి నీ సిద్ధులన్

51. నీ చందంబు తపంబు ప్రేమ దయయున్ నీజ్ఞానమున్ వించు శౌ
రీ! చేమోడ్పనివాడు మానవుడొకో! శ్రీ రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! శౌరీ! నీ చరిత్ర, నీ గొప్పదనము, నీ మార్గము, నీ వాక్యములు, నీ కార్యములు, నీ భక్తితత్త్వము, నీ మూర్తిమత్త్వము, నీ సిద్ధులు, నీ తపస్సు, నీ ప్రేమ, నీ దయ, నీ జ్ఞానముల శ్రవణము జేయుచు, నమస్కరింపనివాడు మానవుడగునా?

మ॥ జగతీనాథుడవై, యనంతసుఖనిస్సాంద్రప్రకీర్తుండవై,
నిగమజ్ఞానయశోవిరాజితగుణానీకంబుచే నొప్పి, స
52. త్య గభీరప్రతిభా విభూషితము నిత్యానంద వైరాగ్య త
త్త్వ గుణోపేతుడవౌట నేదిడుదు దేవా! రామకృష్ణప్రభూ!

శ్రీ రామకృష్ణప్రభూ! జగన్నాధుడవై అనంత సుఖసముదాయముతో, వేద విజ్ఞానముచే ప్రకాశించిన సుగుణములతో కూడియుండుటచేతను, సత్యగంభీర ప్రతిభచే నలంకరింపబడిన నిత్య. ఆనంద, వైరాగ్య గుణరాశివగు నీకు ఏమివ్వగలను దేవా!

శా॥ లోకానన్ గల సర్వప్రసూనచయముల్ లోకేశ్వరా! నిత్యమున్
నీ కంఠంబున దివ్యహారములుగా నేత్రోత్సవంబౌచు నీ
53. యాకారంబు నలంకరింప నిక బుష్పాళిన్ సమర్పింప నె
ట్లో? కళ్యాణసుఖప్రదా! పరమహంసా! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! కల్యాణసుఖప్రదా! పరమహంసా! లోకేశ్వరా! లోకమునగల సమస్త కుసుమ సంచయము నీ కంఠ

మున దివ్యహారములై కంటికింపుగ నీమూర్తిని సదా అలంకరించు
చుండ నీకు పుష్పముల నెట్లు సమర్పింపగలను?

మ॥ భువిలో నున్నవి, మింటనున్నవి, మహాంభోరాశిలో వన్నివా
యువులో నున్నవి, సర్వవిశ్వములలో నుద్భూతమౌ సర్వవ
54. స్తువులన్ గల్గుచు రాజశేఖరుండవై శోభిల్ల, నీకేను యె
య్యవి యర్పింపగజాలువాడ మహనీయా! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! మహనీయా! భువిలో, సాగరములో,
వాయువులో, మరియు సర్వ విశ్వమున జనించిన సకల వస్తు సంప
దల పొంది, రాజశేఖరుడవై ప్రకాశించు నీకు నేను ఏమి అర్పింప
గలను స్వామీ!

మ॥ విరహోద్వేగజతీవ్రవేదనభరావిర్భూతమౌ నా మహ
త్తర బాష్పంబుల నీదు కీర్తన జపధ్యానంబులన్ దేలుచున్
55. బరితృప్తిన్ గన గల్గు నశ్రుతతి నే బాళాలు గావించి, యో
వరదా! నిన్నభిషిక్తు జేసెదను దేవా! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! వరదా! నీ విరహముచే తీవ్ర ఆవేదన
కలిగి, ఆయావేదనా జన్యమైన నావేడి కన్నీటిని, నీ సంకీర్తన,
జప, ధ్యానముల మునుగుటచే బహిర్గతమైన చల్లని నా కన్నీటిని
సమపాళ్ళచేసి, నిన్ను అభిషేకించగలను.

శా॥ నీకై వేడ్కతో గామపాంశువులనే నిర్మూలమున్ జేసి పే
దాకారా! పరిశుద్ధిగా దుడిచి, శ్రద్ధాభక్తులన్ ప్రముగ్గులన్

56. నీ కారుణ్యముచేత బెట్టి, యిట మాణిక్యంపు హృద్పద్మమున్
నీకై యుంచితి కూరుచుండుమిక నేనిన్ రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! పేదాకారా! కోర్కెల అణు సముదాయమును నిర్మూలించి, శుభ్రముగా దుడిచి, నీ దయతో శ్రద్ధాభక్తులను ముగ్గులను పెట్టి, మాణిక్యములతోకూడిన నా హృదయపద్మమును నీ కొరకు ఉంచియున్నాను. ఇక ఆసీనుడవు కా.

మ॥ సుగుణానీకసుమంబులే పరిమళస్ఫూర్తిన్ సుగంధంబులన్
దగు తీవిన్ బ్రసరింప, భక్తిమెయి పాదాబ్జంబులన్ బ్రస్తుతిం
57. చి గగుర్పాటుల నొందుచున్, సకల సౌశీల్యప్రవిష్ణుంపౌ
జగదేక స్తవనీయ గొల్తునిక నిచ్చున్ రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! జగదేక స్తవనీయా! పరిమళస్ఫూర్తితో సుగంధముల వెదజల్లు నా సుగుణములనే పుష్పములను భక్తితో నీ పాదాబ్జములకు అర్పణముజేసి. సకల సుగుణమ్ములతో నలరారు నిన్ను గగుర్పాటుతో. ప్రీతితో పూజింతును.

మ॥ నయనద్వంద్వమునుండి జారు మహదానందాశ్రుస క్తావళుల్
ప్రియుడా! నీ యురమందుపై తుసుమ! నీ పీతాంబరంబౌనుసం
58. దియపమే లేదిక నాదు భక్తి, యట, నీ దేహన శ్రీచందనం
బయి నా సత్త్వగుణంబు రాజిలెడు దేవా! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! ప్రియుడా! అధికానందముతో నా నేత్రములనుండి ప్రవహించిన ఆనందాశ్రువులనే ముత్యములను నీ కంఠ

మున వేయగలను. నా భక్తియే నీకు పీతాంబరము. దేవా! నీ దేహమునకు శ్రీచందనము నా సత్వగుణమేసుమా!

మ॥ కదళీ యామ్లము నారికేళ పనసల్ గల్కండలున్ బప్పులున్
మొదలౌ యల్పపు వస్తుల న్నెటుల నీ ముందుంతు, హాస్యాస్పదం
59. బది! అర్పింపగ నన్యమేదిగలదో యావంతయున్ దోచదే!
పదపద్మంబుల మ్రొక్కు వాడ చెపుమప్పా! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! అరటిపండ్లు, కొబ్బరికాయలు, పనసపండ్లు, కలకండ, పప్పులు మొదలైన వస్తువుల నీకెట్లు అర్పింపగలను? ఎంత హాస్యాస్పదమోగదా! నీకు యిచ్చుటకు అన్యమైన పదార్థములు ఏమియో తెలియుటలేదు. నీ చరణములకు నమస్కరించుచున్నాను తండ్రీ! చెప్పుము.

మ॥ అరిషడ్వర్గముబట్టి నీదు గురుపాదాబ్జంబు ముందుంచి, భీ
కర శక్తిన్‌గల జ్ఞానఖడ్గమున ముక్కల్ జేసి, నీ మ్రోల నా
60. కరముల్ మోడ్చి, భజించి, నీకిడుదు నీ ఖాద్యంబులన్ భక్తితో
పరమేశా! దయతోడ గైకొనుము దేవా! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! పరమేశా! దేవా! నాకు గల కామాద్యరిషడ్వర్గమును బంధించి, నీ పాదములచెంత నుంచి, మహాశక్తియుతమైన జ్ఞానఖడ్గముచే వానిని నీముందు ముక్కలుజేసి, భక్తితో పూజించి, నమస్కరించి, నీకు వానిని నివేదించగలను. దయతో వానిని స్వీకరించు తండ్రీ!

మ॥ గురు దేవుండవు నీవె, నీవె చెలియన్ గో మొప్ప బిడ్డండవున్
ఇరవౌ తల్లివి నీవె, తండ్రియు నీవే నాదు యాదర్శమున్
61. పరమాత్మండవు నీవె, సర్వమవు నా ప్రాణంబవున్నీవె శ్రీ
హరి నీకంటెను నాకు దిక్కెవరు దేవా! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! శ్రీ హరీ! నీవే గురుదేవుడవు. స్నేహితుడవు. బిడ్డవు. తల్లివి, తండ్రివి, నీవే నా ఆదర్శము, నీవే పరమాత్మవు. నీవే నా ప్రాణము. నీవే నా సర్వస్వము. నీకంటె నాకు దిక్కెవరున్నారు దేవా!

మ॥ పటమందున్నిమ గాంచునంతటనె సంప్రాప్తించు సాలోక్యమం
తట నీ దివ్యచరిత్రమున్ వినగ సందర్భించు సామీప్యమే,
62. అటుపై నీ యుపదేశముల్ జరుపగా సారూప్య సాయుజ్య సం
పుటి ప్రాప్తించును భక్తిసంతతికి శంభూ! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! పటమందు నిన్ను గాంచుటచే సాలోక్యముక్తి లభిస్తుంది. అంత నీ దివ్య చరిత్రమును శ్రవణము చేయగా సామీప్యముక్తి ప్రాప్తిస్తుంది, అట నీ యుపదేశముల నాచరించిన భక్తసమూహమునకు సారూప్యసాయుజ్య ముక్తి ద్వయము సంప్రాప్తించును గదా!

శా॥ దోసంబుల్ బహుళంబులయ్యె ననఘా! దూషింపగా వద్దు, మేల్
బాసల్ రావిక నేమిసేతు, గనుకన్ బాలింప నన్ గాంచి, దే
63. వా నప్రీతి విషంబు నిర్జరులకై భక్షించునట్లీవు నా
యాసల్ దీర భుజింపు దోషముల నీశా! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! ఈశా! దోషములు అధికం అయినవని నన్ను దూషించవద్దు. ఇంతకంటె నేను ఏమియు చేయలేను దేవా! అనఘా! కాన నీవు దేవతలకై విషమును భుజించునట్లు నా దోషములను నీవు భక్షించి, రక్షింపుము.

శా॥ సర్వవ్యాపకుడై మహామహిముడై, సర్వాంతరజ్యోతియై,
సర్వజ్ఞత్వవిశేషుడై, యనుపమైశ్వర్యపరిభాపూర్ణుడై,
64. సర్వేశానుడునై విరాజిలెడు సాక్షాద్బ్రహ్మమా నీకు నే
సర్వంబర్పణ జేసి మ్రొక్కెద మహేశా! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! మహేశా! సర్వవ్యాపకుడవై, మహామహుడవై, సర్వాంతరజ్యోతివై, సర్వజ్ఞత్వాదిగుణ విశేషుడవై, అనుపమాన ఐశ్వర్య పరిభాపూర్ణుడవై, సకల ప్రశాసనుడవై, సాక్షాద్బ్రహ్మ స్వరూపుడవై ప్రకాశించు నీకు సర్వార్పణముచేసి నమస్కరించుచున్నాను.

మ॥ ఉదధిన్ బూర్వపు గర్మపరిపాకోద్భూతయోగంబునన్
బడముల్ జారగ బడ్డ పుర్వువలె గూపంబౌ ప్రపంచంబునం
65. దిదిగో జారితి, దుఃఖినై తిరుగుడు భోగేచ్ఛన్ జరించేను నీ
పదముల్ బట్టితి రక్షసేయుమిక దేవా! శ్రీరామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! సాగరమున బడిన కీటకమువలె నేనును పూర్వజన్మ కర్మపరిపాక వశమున యీ లోకమను కూపమున జారి పడియుంటిని, భోగేచ్ఛతో మిక్కిలి దుఃఖించుచు తిరుగుచు నీ పదపద్మముల చేరితిని, ఇక రక్షించుము దేవా!

వ॥ అభిమన్యుండట యుద్ధరంగమున దా నవ్యక్తుడై చొచ్చి పే
 నభిభూతుండగురీతి, లోకమను వ్యూహంబందు నే జొచ్చి, దే
66. వ! భయోపేతమనంబుతో నలిగి తోవన్ గానకే జిక్కితిన్
 అభయంబియ్యవె! నన్ను బ్రోవవె! యనంతా! రామకృష్ణ
 ప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! అనంతా! అభిమన్యుడు తెలియక యుద్ధ రంగమున చొరబడిన విధమున నేనును యీ లోకమను వ్యూహమున ప్రవేశించి, భయముతో నలిగి, మార్గమును దెలియక బాధ నొందితిని. దేవా! అభయమును ప్రసాదించి, నన్ను రక్షింపుము.

వ॥ మనుటే దుర్భరమయ్యె లోకము మహామాయామయంబయ్యె
 పె
 క్కనుతాపంబుల ముంచె భక్తి, పరితాపాగ్నుల్ హృదిన్
 గాల్చె, నా
67. మనమో చంచలమయ్యె, మృత్యువిదె క్రమ్మంజొచ్చె,
 నే దిక్కు లే
 దనఘా! బ్రోవుము నన్ను శ్రీపరమహంసా! రామకృష్ణ
 ప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! పరమహంసా! అనఘా! లోకము మహా మాయామయముగా నున్నది. జీవించుట కష్టముగానున్నది. భక్తి అనేక తాపముల కలిగించుచున్నది. పరితాపాగ్ని హృదయము దహింపజేయుచున్నది. మనస్సు చలించుచున్నది. మృత్యువు దరిజేరుచున్నది. నాకు దిక్కులేదుగదా! రక్షింపుము.

శ్లో॥ నా రూపున్ గని పక్కుపక్కున గటా నవ్వంగతంబేమి? ఏ
దారిన్ గాంచక దీవ్ర దుఃఖమున నే దైన్యంబునన్నేడ్వగా
68. పైరావన్ నను వెక్కిరించెనె దిశల్! హాస్యాస్పదంబయ్యెగా
నీరితిన్ గన నాదు జన్మ గుణశాలీ! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! గుణశాలీ! నా స్వరూపమును జూచి నవ్వుటకు కారణం ఏమిటి? దీనుడనై, ఏదరిగాంచక నేను తీవ్ర దుఃఖమున నుండగా దిక్కులు పైరముతో నన్ను పరిహాసము చేయుచున్నవిగదా! ఈ విధంగా నా జీవితము హాస్యాస్పదముగా దయాపైనది.

పు॥ దినముల్ దాటెను నిన్ను గాంచగదు! నీ దివ్యాంఘ్రిసంసేవ నే
ననయంబున్ గని మోదమందు తలపుల్ స్వప్నంబులై
పోయె, నిం
69. కనిరాసల్ బహుళంబులయ్యె, బలుశంకల్ గష్టముల్ మించె
నన్
గనులన్ జూడక నుంట భావ్యమె! శుభాంగా! రామకృష్ణ
ప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! శుభాంగా! దినములు దొర్లిపోవు చున్నవి గాని నిన్ను దర్శించలేదు, సదా నీపాదసేవ చేయుచు ఆనందించవలయునను భావనలు స్వప్నములైనవి. నిరాశ అధికం అయినది. సంశయములు, కష్టములు ఎక్కువ అయినవి. నీవు నన్ను చూడక యుండుట భావ్యమా?

శా॥ ఎంతో వేడితి నేడ్చితిన్ విసిగితిన్ హేయంపు సౌఖ్యంబులన్
సాంతంబున్ద్యజించియున్; పరమమౌ సంతోషమున్ గాంచి లో
70. శాంతిన్ బొందమి కెంతో దుఃఖిలి నిరాసన్ జెంది 'ఛీ'యంచు నీ
చెంతన్ జేరకపోదునేమొ! యకటా! శ్రీరామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! అకటా! ఎంతో ప్రార్థించాను నిన్ను. ఎంతో విలపించాను, హేయ సుఖాలను సాంతముగ త్యజించి యుంటిని. పరమ సంతోషమును పొందలేక, శాంతిని అందుకొనలేక, ఎంతో దుఃఖించాను. విసిగిపోయాను. నిరాశ చెందాను. నీ దరికి చేరలేనేమోగదా!

శా॥ ఎన్నాళ్ళిట్టుల యోచనాజగతిలో తృప్తుండనై యుంట! నే
నెన్నాళ్ళింకను మిమ్ము గాంచక గటాయిట్లుంట వ్యర్థుండనై!
71. ఎన్నాళ్ళుండుట వ్యర్థలోకమున! సర్వేశా! పరంధామ! ఇ
ట్లెన్నాళ్ళింక బరీక్ష నాకు అకటా! శ్రీరామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! అయ్యో! నాకు ఎన్ని దినములు యీ పరీక్ష? ఆలోచనా లోకమున ఎన్ని రోజులు తృప్తిపడి ఉండుట? పరంధామా! నిన్నుగాంచక ఎన్ని దినములు వ్యర్థమగుచున్నవి! సర్వేశా! ఈ అనవసర ప్రపంచమున ఎన్ని దినములు ఉండటమో!

శా॥ నిన్నే గోరితి, నిన్నె నమ్మితిని, నిన్నే గొల్చి ప్రార్థించి, నీ
సాన్నిధ్యంబును గోరితిన్, జపతపస్స్వాధ్యాయరూపంబులన్

72. నిన్నున్ సాధ్యముజేయ నెంచితి, నికన్ నీ ప్రేమరాకున్నచో
భిన్నంబై చెడు నాదు సాధన తపస్వీ! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! తపస్వీ! నిన్నే కోరి, నిన్నే విశ్వసించి, నిన్నే ఆరాధించి, నిన్నే ప్రార్థించి, నీ సన్నిధానం కోరుకున్నాను. జపతప స్వాధ్యాయములతో నిన్ను సాధ్యం చేసుకోవాలని ప్రయత్నించుచున్నాను. నేటికైన నీ ప్రేమ నాపై ప్రసరింపనిచో నా సాధన చెడిపోవు అవకాశమున్నదిసుమా!

మ॥ అసహాయుండను, శక్తిశూన్యుడను, సత్యాన్వేషణోద్రిక్తమా
నసుడన్, భక్తజనైకభృత్యుడను, సన్మార్గంబులన్ జూపి సం
73. తసమున్ గూర్పగలట్టి సద్గురుల సందర్శింపగా లేక నే
విసుగుం జెందితి, నిన్ను గొల్చితిని, రావే! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! నేను నిస్సహాయుడను. బలహీనుడను సత్యాన్వేషణచేయు మనస్సు గలవాడను, భక్త జనాళికి దాసుడను. సన్మార్గముల దెలియపరచి, సంతోషమును చేకూర్చు సదురువుల గాంచలేక విసుగుచెందిన నేను నిన్ను ఆరాధించుచున్నాను. ఇక రా.

శా॥ నాకీ కష్టపరంపరల్ దనముకై నన్ భోగిగా జేయుతన్!
నాకానందము నిచ్చు భాగ్యమువలెన్ నా యీ యసంతృప్తి! నే
74. నీకై నిత్యము పేడుచున్ వెతకుటల్ నిక్కంబు నా వృత్తి! ఆ
హా! కైవల్యమనంగ నీ సుఖముగాదా! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణ ప్రభూ! ఈ కష్టపరంపరలన్నియు నాకు ధనములై భోగిని జేయుగాక! నా యీ అసంతృప్తి సంతోషమును కలిగించు సంపదవంటిది యగుచున్నది. నిత్యము నిన్ను ప్రార్థించుచు, అన్వేషించుటయే నావృత్తి! అహా! కైవల్యమన నీ సుఖమేగదా!

శా॥ నీ పాదంబుల బూజలన్, జపతపోనీకంబులన్ జేసి, నీ
ప్రాపున్ జెందు యఖండ మోదమును నాపై నుంపవే, కాక సం
76. తాపంబుల్ నను ముంప నల్పసుఖసంధానంబునన్ బూర్తిగా
పాపిన్ జేయుము నన్ను, కాదనను దేవా! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! నీ పాదపూజయు, జపతపాదులను గావించిన నన్ను, నీ దరికి జేర్చు అఖండానందమును ప్రసాదింపుము. లేనిచో అల్ప సుఖసముదాయమున తాపత్రియాదికమున నన్ను పూర్తిగా ముంచి పాపిగా చేయుము దేవా! కాదనను.

మ॥ వలదయ్యా యిక భోగముల్ సుఖములున్ ప్రఖ్యాతులున్ వ్రాతలున్
పలుకుల్ గ్రంథములుల్ ప్రసంగములు, నాపై ప్రేమచే జిత్త చం
76. చలతన్ నాకిక బాపి, శాంతిసుధకున్ స్థానంబునౌ సత్ సమా
ధుల నాకిమ్ము నమస్కరింతు గుణసింధూ! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! గుణసింధూ! ఇక నాకు భోగములు, సుఖములు, కీర్తిప్రతిష్ఠలు, వ్రాతలు, మాటలు, గ్రంథములు,

ప్రసంగములు, యిపేమియు వలదు. నా చిత్త చంచలత్వమును పోగొట్టి, శాంతిసుధా నిలయమగు సత్సమాధులను ప్రేమతో నాకు ప్రసాదించుము. నమస్కారము.

మ॥ అనయంబున్ గురుపాదపద్మమకరందాస్వాదనల్ సేయు కో
రిక నిరాశల్ బ్రభవించి వ్యాధివలె శక్తిన్ జంపెడిన్, తన్నివా
77. రణకై నీవు భిషగ్వరేణ్యుడవు! నీ ప్రఖ్యాత దివ్యాంఘ్రి ద
ర్శనభాగ్యంబె మహౌషధమ్ముగద! ఈశా! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! ఈశా! నిత్యము గురుపాదపద్మము నందలి మకరందరసాస్వాదన జేయవలెనని కోరిక కలిగి నానిరాశ వ్యాధివలె కలిగి ఆ శక్తిని నశింపజేయుచున్నది. ఆ వ్యాధి నివారణకు నీవు ఉత్తమ వైద్యుడవు. ప్రశస్తమైన నీ దివ్య పాద సందర్శనభాగ్యమే గొప్ప ఔషధముసుమా!

మ॥ నిరతంబున్ నిను జేరి యాటల సదా నీతోడనే యాడి, భ
క్తిరసాస్వాదన సంపదల్ గనుచు, నీకే సర్వమర్పించి, సు
78. స్థిర మోదంబున నృత్యగీతములతో జెల్వొందు భాగ్యమ్ము నా
కిడలేపైతివదేమి పాపమగు స్వామీ! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! ప్రతిదినము నిన్ను చేరి, నీతో ఎల్లప్పుడు ఆడుతూ, భక్తిరసాస్వాదనజేయుచు, సర్వము నీ కర్పించి, నృత్యగీతములతో మెలగుచు సుస్థిరమైన ఆనందమున నుండు భాగ్యమును నాకు ప్రసాదించలేపైతివిగదా స్వామీ! ఏమి పాపమోగదా!

శా॥ (శ్రీ)దేవున్ నిను పేడనంచలిగితో చిత్తంబునన్ గర్వి వీ
డా దాసుండని కోపమా! నియమ నిష్ఠల్ లేమికిన్ గిన్కయో!
79. ఏదో కారణమెద్దియో తలపు, నన్నీరీతి బాధింప నీ
పాదాక్రాంతుడనైతి నిక్కముగ దేవా! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! దేవా! దేవుడపైన నిన్ను ప్రార్థించ లేదని అలిగితివా? లేక 'వీడు గర్వి దాసుడు కాడు' అని నాపై కోపించితివా? నియమనిష్ఠలు లేవని అలుకా? కారణమేమియో అను భావనలు నన్ను బాధించుచుండగా నీ పాదాక్రాంతుడనై యున్నాను సుమా! సత్యము.

మ॥ నిను దర్శించెడు భాగ్యమబ్బునని నే నిర్భీతి బంధంబులన్,
దునియల్ జేయుచు బర్వులెత్తితి సముద్యోత్సాహినై కాని నిన్
80. గనలేకుంట, నిదర్శనంబులసలే కన్పింపవౌటన్ నినున్
గనుటే దుర్లభమంచుదోచుగద! రంగా! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! రంగా! నిన్ను దర్శించే భాగ్యం కలుగుతుందని, బంధముల ఛేదించి, ఉత్సాహముతో బరుగులు వేశాను. కాని నిన్ను చూడలేక, కనీసము ఆ నిదర్శనములైనను గోచరింప కుండుటచే, నీ దర్శనం అసాధ్యమని భావిస్తున్నాను.

మ॥ పిలువన్ బల్కెడు పేడ్చినన్ గరుణతో బ్రేమించి రక్షించుతు
వన్
బలుకుల్ గల్లలు, హాసలీలతొ గోపశ్రేణితో నాడుటల్
81. గలలౌ నిక్కము. నన్ను బ్రోచునెడ నీ కార్యంబులెల్లన్ నిజం
బులు ముమ్మాటికి నమ్ముమింక నను శంభూ! రామకృష్ణ
ప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! పిలిచితే పలుకుతావని, ఏడిచిన కరుణతో ప్రేమించి రక్షిస్తావను మాటలు అబద్ధమే. శంభూ! నీవు గోప బాలురతో నానందముగ నాటల నాడుటయు అసత్యమే. నన్ను నీవు రక్షించనచో నీ కార్యములన్నియు నిజములే, ముమ్మాటికి నమ్మి నమ్మి.

శా॥ దాగన్ జూచెదవేల? నీకు భయమా? ధైర్యంబు నిన్వీడెనా?
త్యాగాలన్ భవదీయ భక్తతతికై తథ్యంబుగా సేయుటల్
82. వాగాడంబరమయ్యెనా? ప్రతినలన్ బాటింపగా లేవో! ఆ
ప్రాగల్భ్యమ్ముల నేల కొట్టితివి దేవా! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! దాగటం ఎందుకు? భయమా? లేక నీకు ధైర్యములేదా? నీ భక్తులకై త్యాగముచేయుట వాగ్దానము లేనా? ప్రతిజ్ఞలను పాటింపలేవా? దేవా అన్నియు ప్రగల్భములేనా?

మ॥ నిను జిత్తంబున దాచెనో ధృవుడు! సంతృప్తిన్ గజం బడ్డెనో
నిను బ్రహ్లాదుడు నిల్పెనో! శబరి బందిన్ జేసెనో! అంజనే
83. యుని గౌగింటను జిక్కితో! పరమ భక్త్యున్మత్తతన్ గట్టెనో
మునివర్యుండు వివేకసంయమి! స్వయంభూ! రామకృష్ణ
ప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! స్వయంభూ! నిన్ను ధృవుడు తన చిత్తమున దాచెనా? లేక గజరాజు అడ్డగించెనా? లేక శబరి బంధించెనా? లేక అంజనేయుని కౌగలిలో చిక్కియుంటివా? లేక మునివర్యుడైన వివేకానందుడు భక్తితత్పరతతో కట్టివేసెనా?

మ॥ తలతున్ వింతగ భక్తి రిత్తయని, వ్యర్థంబౌను జ్ఞానంబు నా
గలతన్ జెందెద, ధ్యాన యోగములు సత్కర్మంబులున్ మిథ్యలౌ
84. పలుకష్టంబుల మోక్షకాంక్ష యిడు నా భావంబులే ముంపగా
జలితాత్ముడను రక్షసేయవె! మహేశా! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! మహేశా! భక్తి లేదనియు, జ్ఞానము వ్యర్థమనియు కలత చెందుతాను. ధ్యాన, యోగ, సత్కర్మలు మిథ్యయని భావించుతాను. మోక్షకాంక్ష అనేక కష్టములను కలిగిస్తుందను భావన కలిగి, మనస్సులో చంచలత్వం కలుగుతున్నది. నన్ను రక్షించు.

మ॥ పరితాపాగ్ని నడంప సాగరము నాపై దొర్లిరాదే! మనో
భరమున్ గాల్ప దవాగ్ని పైబడదె! నా పాపంబులన్ ద్రోల భీ
8 . కరమౌచున్ సుడిగాలి రాదుగద! నా కర్మంబులన్ ద్రెంపన
న్నెరగా గాంచదె మృత్యుదేవతయు స్వామీ! రామకృష్ణ
ప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! స్వామీ! నా పరితాప నివారణకు నాపై సాగరమైనను దొర్లిరాదుగదా! నా మానసిక భారమును కాల్చుటకు దావాగ్నియైనను రాకున్నది కదా! నా పాపములదొలగద్రోయుటకు భయంకరమైన సుడిగాలియైనను రాకున్నదిగదా! నా కర్మ పాశముల ద్రెంచుటకు మృత్యువైనను రాదుగదా!

మ॥ గగనంబే పడుగాక నన్ దునుమగా! ఖండంబులై వేగ నన్
దెగటార్పన్ బడుగాక మేఘములు! నన్ దీనున్ దినేశుండు పూ

86. ర్తిగ భస్మీకృతి సేయుగాక: మనుటల్ రిత్తయ్యె: వ్యర్థంబుగా
బగులున్ జన్మము గాజుముక్కవలె దేవా: రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! దేవా: నన్ను చంపుటకు ఆకాశము నాపై పడుగాక: నన్ను ముక్కలు జేయుటకు మేఘములు పడును గాక: దీనుడనైన నన్ను సూర్యుడు పూర్తిగా భస్మము చేయుగాక: జీవించుట వ్యర్థము, ఇక గాజుముక్కవలె జన్మము వ్యర్థముగా పగులుచున్నదిగదా:

శా॥ ఏ నీ నామవిలోలతోన్నతి ప్రపంచేచ్ఛల్ దరిన్ జేరవో:
ఏ నీ వాక్యసుబోధ యింద్రియ జయంబేర్పాటు గావించునో!
87. ఆ నిర్వాణప్రదమైన సిద్ధి నిడి బ్రహ్మైక్యాను సంధానమం
దే నుండన్ గల సూత్రమున్ దెలుపరావే: రామకృష్ణప్రభూ:

శ్రీరామకృష్ణప్రభూ: ఏ నీ నామోచ్చారణముచే ప్రపంచ కోరికలు చెంతకు చేరవో, ఏ నీ ప్రబోధములు ఇంద్రియ నిగ్రహం ప్రసాదించునో, అట్టి నిర్వాణప్రదమైన సిద్ధిని అనుగ్రహించి, నిత్యము బ్రహ్మైక్యానుసంధానము చేయగలుగు సూత్రమును నాకు దెలియజేయుటకు రమ్ము.

శా॥ నీకై కానల గొండలన్ దిరిగితిన్, నిన్ బొందు చిత్తంబుతో
లోకవ్రాతములెల్ల గ్రుమ్మరితి నో లోకేశ్వరా: నా మనో
88. పైకల్యంబును బాపి, శాంతి నొడగూర్పన్ నిన్ను ప్రార్థింతునే:
నా కష్టంబుల వీడజేయుమెట్లైనన్ రామకృష్ణప్రభూ:

శ్రీరామకృష్ణప్రభూ! లోకేశ్వరా! నీకొఱకు అరణ్యాలలో, కొండలలో తిరిగి యుంటిని. నిన్నుపొందు మనస్సుతో లోకమంతయు తిరిగితిని. నా మనోవికలత్వాన్ని తొలగద్రోసి, నా కష్టముల పారద్రోలుము.

మ॥ చీకట్లం గని వెల్గు పర్వ్వెకరణిన్, సింహంబు భీతిల్లుచున్
మేకన్ గాంచిన బారురీతి, గన స్వామీ! భీతచేతస్కమై
89. ఆకంపించుచు బర్వ్వెత్తుగద బ్రహ్మజ్ఞానమజ్ఞాన దు
ష్టాకారంబును గాంచి చోద్యముగ నీశా! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! స్వామీ! అంధకారమునుగాంచి ప్రకాశము పరుగుపేయునట్లు, నక్కనుజూచి మృగరాజు భీతిల్లుచు, పరుగెత్తినచందము, అజ్ఞానమను దుష్టస్వరూపమును తిలకించిన బ్రహ్మజ్ఞానము భయముతో పర్వ్వెత్తుచున్నదిగదా! ఈశా! ఎంత చోద్యము!

మ॥ ధనధాన్యంబులు తల్లిదండ్రులు, గురుల్ దారల్ సఖుల్ సోదరుల్
దనయుల్ మృత్యుముఖంబునంబడుట సంతాపింతురేగాని, 'దే
90. వుని నిన్నున్ గనమైతిమే, ప్రభుని ప్రాపున్ బొందగా నైతిమే'
యని దుఃఖింపరుగాదె లోకమున దేవా! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! ఈ లోకమున మృత్యుముఖమున నుండు సమయమునగూడ ధనధాన్యములు, తల్లిదండ్రులు, స్నేహితులు

సోదరులు, భార్యాబిడ్డలు అని సంతాపము చెందుదురుగాని, 'దేవా, దేవుని నిన్ను జూడక పోతిమిగదా! నీ సన్నిధిని పొందలేకుంటిమిగదా' అని దుఃఖింపరుగదా!

శా॥ నా మిత్రుండును, నాతనూజుడితడున్, నాతల్లి నాతండ్రి యం
చేమెమో మమకార బంధములచే స్వేచ్ఛాకృతిన్ బాసి, ఆ
91. వ్యామోహంబున మ్రగ్గుచుండ్రుగదా! నిత్యానందు నిన్ బొంద నీ
నామంబైనను పల్కరారుగద యన్నా! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! నా మిత్రుడు, నా కుమారుడు, నాతల్లి, నా తండ్రియనుచు అనేక మమకార బంధములచే నస్వతంత్రులై, ఆ వ్యామోహమునబడి తపింతురుగదా! కాని అన్నా! నిత్యానందుడవైన నిన్ను చేరుటకు నీనామమైనను పలుకరుగదా!

మ॥ భ్రమచే నీరని యెండమావులను సంభావించు నజ్ఞాని, స
ర్పముగా త్రాటినిగాంచు భ్రాంతుడును, అవ్యక్తుండుగా వెండి శు
92. క్తమునన్ గాంచెడువాడు, చూడగలడే జ్ఞానస్వరూపున్ ఘనున్
అమితానందు మహాత్ము నిన్ను గురుదేవా! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! గురుదేవా! ఎండమావుల జూచి జలముగ భావించువాడును, త్రాటిని సర్పముగ గాంచువాడును, ముత్యపుచిప్పయందు వెండిని తిలకించువాడును అజ్ఞానముచే, ఆనందస్వరూపుడవును, జ్ఞానఘనమూర్తివి, మహాత్ముడవైన నిన్ను తెలియలేరుగదా!

మ॥ వేదశాస్త్రంబుల బిప్పసేయు చదువుల్ వేదాంతవాదంబులున్
బదభేదంబులు తర్కవాదములు తత్త్వార్థపరిక ర్షంబులన్
93. చదువన్ గార్యమొకింతయుండునె! సదా సద్భక్తియుక్తంబుగా
మదిలో నిన్ను భజింపకుండిన మహాత్మా! రామకృష్ణప్రభూ

శ్రీరామకృష్ణప్రభూ! మహాత్మా! సద్భక్తితో నెల్లప్పుడు నిన్ను చిత్తమున భజింపకున్నచో నీ శాస్త్రపఠనములు, వేదాంత వాదములు, పదభేదములు, తర్కవాదములు మొదలైనవాని వలన నేమి ప్రయోజనము?

శా॥ ఎన్నెన్నో యధికారముల్ గలుగ, నెన్నో గ్రంథముల్ గ్రోల, నె
న్నెన్నో మాటలనాడ, వేదముల నెన్నోమార్లు వర్ణింప నో
94. యన్నా సున్న, జితేంద్రియంబుగని యభ్యాసంబు గావించి భా
వౌన్నత్యంబు గడింపకుండిన మహేశా! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! మహేశా! ఎన్ని అధికారములున్నను, ఎన్నిగ్రంథముల జదివినను, ఎన్ని ప్రసంగముల చేసినను, వేదముల నెన్ని పర్యాయములు వర్ణించినను, ఇంద్రియ నిగ్రహము, ఉన్నతభావ సంపదలేనిచో నివియన్నియు వ్యర్థమేగదా!

మ॥ తమ చారిత్రసుధాతరంగముల నీదన్, నీ మహావాక్య సా
రమశేషంబుగ గ్రోల, నీదు సుగుణపరిజ్ఞాపరిసారంబులన్
95. శ్రమదీరంగ మునుంగ, నీ పసిడితేజంబందునం దేల, వే
రె మనోజ్ఞంబగు మోక్షమెందుగలదో! శ్రీరామకృషప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! నీ జీవితసుధాతరంగముల నీదు లాడుచు, నీ మహావాక్యప్రబోధ సారమును పరిపూర్ణముగ గ్రోలుచు, నీ సుగుణ ప్రజ్ఞాప్రవాహమున శ్రమదీరునట్లు మును గుచు, నీ స్వర్ణకాంతియందు దేలుచునుండినచో నిక ఆనందమయ మోక్షము వేరుగ ఎచ్చట నున్నది?

మ॥ నిను బ్రార్థించుచు నామమున్ బలుకుచున్ నీ పాదపంకేరుహం
బును బూజించి నమస్కరించి గురుతత్త్వోద్భూతబోధామృతం
96. బును సేవించుచు, సాశ్రునేత్రుడయి ప్రేమోన్మత్తుడై
యాడినన్
గనదే మోక్షము భూతలంబుననె రంగా! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! రంగా! నిన్ను ప్రార్థించుచు, నీ నామమును పలుకుచు, నీ చరణములను పూజించి, నమస్కరించి, నీ బోధామృతమును సేవించి, ఆనంద బాష్పములతో ప్రేమో న్మత్తతచే నృత్యము సలిపినచో యిచ్చటనే మోక్షమును పొందును గదా!

మ॥ పసిడిన్ మట్టిని నేకదృష్టి గనినన్ వ్యామోహమేలేని బా
లు సమానంబుగ స్త్రీని దల్లివలె నాలోకించినన్ సర్వ జీ
97. వసమూహంబును బ్రేమతో గనిన నిర్వ్యాజంబుగా గర్మ జే
య, సమాయత్తముగాదె మోక్షమిట దేవా! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! దేవా బంగారమును మట్టిని ఏకదృష్టి తిలకించి, వ్యామోహరహితుడైన బాలునివలె స్త్రీలను మాతృ మూర్తివలెజూచి, సర్వజీవుల బ్రేమతో గాంచి, నిష్కామముతో గర్మల నాచరించిన మోక్షమిచ్చటనే లభించును.

మ॥ జలమేరీతిగ దేశదేశముల భాషాభేదమున్ బట్టియే
జలమంచున్, మరి నీరు వాటరని దేశాలన్ పవ్రివర్తిల్లునో
98. అల దేవుండు శివుండు విష్ణు యహోవా యల్లా యుమా నామముల్
గలవాడయ్యు నభిన్నుడౌనుగద! రంగా! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! రంగా! జలము ఏ విధముగా దేశదేశముల బ్రవహించుచు, భాషాభేదములచే నీరు, జలము, వాటర్ అని పిలువబడునో అదేవిధముగ ఆదేవుడును దేశదేశముల భాషాభేదముచే శివ, విష్ణు, ఉమ, అల్లా, యహోవా నామముల వ్యవహరింపబడెనని, అందుభిన్నత్వము లేదనియు ఆచరణ పూర్వకముగ సమైక్యతను బోధించితివిగదా!

మ॥ స్తవనీయంబగు కామరాజుకుల సంజాతుండ శ్రీచెన్నకే
శవులున్ లక్ష్మిసరస్వతీ హృదయ సత్ జన్ముండ, సద్భక్త బాం
99. ధవుడన్ సింగరిదాస పౌత్రుడను ముకుందాఖ్యుండ నిన్ గూర్చి నే
స్తవమున్ జేయదలంచి వ్రాసితిని యీ 'శ్రీరామకృష్ణాంజలిన్'.

శ్రీరామకృష్ణప్రభూ! సద్భక్తులకు బంధువైన శ్రీ భక్త సింగరిదాస పౌత్రుడనై, ప్రసిద్ధమైన కామరాజు వంశోద్భవుడనై శ్రీ లక్ష్మీ సరస్వతీ, చెన్నకేశవుల పుత్రుడనై, ముకుంద నావ

ధేయుడనైన నేను నిన్ను స్తుతించు సంకల్పముతో యీ 'శ్రీరామ కృష్ణాంజలి'ని వ్రాసితిని.

మ॥ జయ చంద్రామణీపుత్ర, కాళిసుత, శాస్త్రార్థస్వరూపా హరీ!
జయ సర్వోత్తమతత్త్వలోకగురు, సాక్షాత్ సచ్చిదానందమా!
100. జయ మౌనీంద్ర నరేంద్రపూజిత సురేశా శ్రీముకుంద ప్రియా!
జయముప్పొంగునుగాక భక్తులకునీశా! రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ! చంద్రామణీ పుత్రా! కాళీసుతా! శాస్త్రార్థస్వరూపా! హరీ! సర్వోత్తమతత్త్వలోక గురూ! మౌనీంద్రా! నరేంద్రపూజితా! సురేశా! సాక్షాత్ సచ్చిదానందమా! శ్రీ ముకుందప్రియా! నీకు జయమగుగాక! ఈశా! నీ భక్తులకు జయముప్పొంగునుగాక!

మంగళం మహత్



లౌకిక జీవితంలో మానవుడు, స్వల్ప విషయాల్ని విడిచి, గొప్ప విషయాలకై పరుగులు పేస్తుంటాడు. కాని అనిత్య విషయాన్వేషణ కొనసాగిస్తాడు. ఇది ఎంత హాస్యాస్పదం! అనిత్య ప్రపంచంలో, అనిత్య మానవుడు, అనిత్య సంపదకై ఆవేదన చెందటమా? ఇది స్వార్థం.

అసత్య ప్రపంచంలో, అశాశ్వత మానవుడు నిత్య స్వరూపుడైన భగవంతునికై ఆవేదన చెంది, అన్వేషించి హృదయమును భగవానునికి నివేదించుకొని, తపించటం భక్తి. ఇది ఆనందదాయకం

భగవంతుని ప్రతిదినం పూజించినా, దేవాలయానికి వెళ్లినా, రామకోటి వ్రాసినా, భక్తి గ్రంథాలు చదివినా, శ్రవణం చేసినా భక్తి కాదు. కాని ఆవేదనతోనే భక్తి ప్రారంభం. ఆ ఆవేదనలోనే లోక అనిత్యత్వం, లోకం పోకడలు అర్థం అవుతాయి. జీవితం వ్యర్థం అవుతున్నదనే బాధ గోచరిస్తుంది. దుఃఖం పొంగి పొర్లుతుంది. అప్పుడప్పుడు నిరాశా నిస్పృహలు ఆవరిస్తాయి. భగవద్వియోగాన్ని భరించలేడు. ఆ ఆవేదన పరాకాష్ఠ నందుకుంటుంది. అప్పుడే భగవద్దర్శనం, దుఃఖరాహిత్యం, ఆనందప్రాప్తి! యథార్థ భక్తి పరులకు, యథార్థ భక్తి విషయములిందు సువ్యక్తము. శ్రీ అనుభవానంద స్వాములవారి ఆవేదన యిందు పత్యక్ష గోచరము. అదియే . . . . . .

'శ్రీ రామకృష్ణాంజలి'

శ్రీ శారదా ప్రింటర్సు - బాపట్ల.